# రాజతరంగిణి

## సప్తమతరంగము - ద్వితీయభాగము

రచయిత :
విద్వాన్ రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి బి. ఎ.,



తొలికూర్పు
1957

కళాకల్లోలినీ గ్రంథమాల
గొల్లపల్లి

# రాజతరంగిణి

## సప్తమ తరంగము

[ద్వితీయ భాగము]

కల్హణపండిత ప్రణీతంబైన
సంస్కృత మూలమునకు స్వేచ్ఛానుసరణము.



రచయిత:

విద్వాన్ రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి బి. ఏ.,
సీనియరు తెనుగు పండితుడు
బోర్డు హైస్కూలు
గొల్లపల్లి

 [వెల 0-75 న. పై.

# రాజతరంగిణి

## సప్తమతరంగము - ద్వితీయభాగము



వచ్చె వరాహమల్ల యను వారువ మొక్కటి హర్షువీడి తా
దెచ్చె ప్రసూనదామకము దివ్యముగా బడవైచె శీర్షమం
దిచ్చిరమేయ ప్రోద్బలము నెక్కుడు ధైర్యము కక్కుడాడిగా
నచ్చిన శూరులెల్లరు ఘనంబుగ దన్ను పరాక్రమింపగన్. 1

హాష్కపురమును వీడి తా నుచ్ఛలుండు
దరిసె క్రమరాజ్యమునని డామరులెరింగి
సంభ్రమంబున మండలేశ్వరునిపైన
దాడిచేసి యోడించిరి తారుగూడ. 2

వ. అంత మండలాధీశ్వరుడు క్రమక్రమముగా తారమూలకము
నకు వలాయితు డగుటగాంచి యుచ్ఛలుడు వెంబడించెను
గాని చాలదినములవరకు నాతను పట్టుకొనలేదు. 3

పెట్టని కోట లీభరత పృథ్వికి నెచ్చట మంచు తా సదా
నిట్టలమై చెలంగును వనీఘనశాఖుల రాపులాడుచున్
నిట్టనిటారుగాగలుగు నెందుతరుల్ వనమాహిషాది సం
ఘట్టనలేమెడన్ వినగగల్గుదు మట్టిహిమాలయంబులన్. 4

డాగెను మండలేశ్వరుడటంచు నెరింగి పిరుందనేగి యెం
దేగుహలందుదూరి వెలుగేనియు జూడకయున్నవాని బం
దీగ నొనర్చెనుచ్ఛలుడు, తేజము నెల్ల కడింది తూలి యా
వేగరి హర్షపైగలుగు ప్రేమను బాయగలేక యిట్లనున్. 5

మంచితరుణము నే డరుదెంచె బలిమి
రాజనగరముపై బడి రాజ్యమెల్ల
లోగొనుట కుచ్ఛలా! నీవు లోవెరవక
దాడిసేయు మిప్పుడ యసాధ్యంబునాక. 6

కృత్రిమ బుద్ధియై తనకు గీడొనరింపదలంచు మండల
క్షాత్రపు మాటకియ్యకొని శౌర్యము ధైర్యము మీరనుచ్ఛలుం
డాత్రిదివాపగన్ గడచి యవ్వలకేగిన యట్లగడ్డ నా
రాత్రి తరించి పట్టె పురరాజము నా పరిహాసకేశమున్. 7

వ. ఇట్లు రాజనగరమును చేరియు. 8

మోసకాడైన మండల భూమిపతిని
తెలియగానేరకుండె నాయలఘుబలుడు
నాటిరాత్రి యుచ్ఛలునితో మాటుమణగి
తాను శయనించు గృహమును తగులబెట్ట
నోజయొసగె నాత్మీయభృత్యుల కతండు. 9

ధీబలంబున కీడగు దేహబలము
శౌర్యమును నున్నచో నెట్టి కార్యమైన
సులభముగ జేతు రీగడుసుందునుకలు
సందియము లేదు; కాని యాశౌర్యగుణము
దుర్బలంబుగ, షండత దోర్బలయుత
ముగనొనర్చు పురాకర్మ మగును వింత. 10

నీటిలోపల దిరుగు తాబేటివీపు
నతిదృఢమ్ముగ జేసి హార్యక్షమునకు
చర్మమును పల్చగనొనర్చు చతురసృష్టి
బ్రహ్మకే చెల్లెగాక;

ఆపైన మండ
లాధినాథుడు హర్షసీమాంతికమున
కంపె నుచ్ఛలు జంబుక ప్రాయుడైన
యితని వధియింపు మీవు హరీంద్రనిభుడ!
యనుచును; 12

నృపాలు డత్యంతమైన ప్రేమ
మీర నుచ్ఛలుతో మైత్రిగోరి వీర
భటులనైకొని తత్సమీపమున కేగు
వాడని యెరింగి మాయచే పలువు రహిత
సైనికులజంపి యుత్తమాశ్వమ్ము నెక్కి
వడివడిగ వచ్చి గౌరికావలముకడను
దాటుచు వితస్థ నొందరు డామరులును
తన్ను గలియగ వారితో దానుగూడి
వచ్చె తరుమూలమునకు నవార్యబలుడు. 13

ద్యూత కరులాకించుక లాభయోగమున్న
మిన్ను మన్నును గానక మిట్టిపడెడు
రీతి హర్షుడు తన శత్రువీతెరగున
పాఱుటను గని సంతోషభరము మీర
తిరిగి తావచ్చె రాజనగరము చేర. 14

విజితులైయయ్యుడామరులు వెంబడి రా జరుదేరకుంట తా
మజితులయట్ల యాత్మల మహోహవకౌతుకమొప్పనుండి రో
క్కజిగిని జ్యేష్ఠమాసమున కందరు డామరులున్ విశేషహా
విజయముగోరి చేరిరొక వెంట నె త్మామభయమ్ము గీడ్పడన్. 15

ఆపరిహాసపట్టణమునందలి విగ్రహమొండు ఉచ్ఛల
త్మాపతిగాచె దానినె నృశంసుడునై నరనాయకుండు గం
డోపలభాతిజూచె నదియొక్కటె హేతువు తత్పురస్థసౌ
ధోపరిభాగమెల్లపుడు ధూమ్రమవివర్ణవికారహాటకున్. 16

ఆదేశాన దివావిభాగమున పెల్లైతోచు తామిస్ర మం
దీ దారిద్ర్యము వాయజేయుటకునో యిట్లున్న వస్రీతి పె
క్కైకదీప్తాంగములైన రూపకపుమొక్కల్ కారుచీకట్లనే
పోదోలున్ ప్రభువుండి వెల్తురులునింపున్ సత్కృపాశ్రేయుడై 17

అట్టి ప్రభువిప్డులేమి నాపట్టణమున
కారుచీకట్లె యెల్లెడక్రమ్మివైచె
రాజొనర్చిన దుష్కర్మ ప్రజలనెల్ల
పట్టి పీడింపదొడగె నభాగ్యవశత. 18

శత్రుసైనికులీరీతి సన్నగిలిన
ధైర్యమున నుంటగని వసుధావరుండు
గర్వమున నుండె; శూరనగరముపైన
నుస్సలుడు దాడిచేయగా జూచుచుండె. 19

వ. ఏ డవనాహాపురమున నుండ దనసోమరితనమునకు తండ్రిచే
నదలింపబడి కార్యాచరణమునకు పురిగొల్పబడెను. 20

తరుమూలంబున నున్నయుచ్చలుడు యోధాగ్రేసరుల్ గొల్వలా
వరియై మీరుచునుండె నాతని వ్యవస్థన్ చేరి నారెల్ల డా
మరులున్; వారు నృపాశ్వసైనికులనే భ్రమందించి బాధించి త
ద్గిరి మార్గంబునుబట్టి చేరిరరిరాడిక్కారిలోహారమున్. 21

హార్షుడీలోన ద్వారనాయకపదం బొ
సంగి యుదయరాజునకు; నుచ్చలు జయింప
నంపె మండలపతిని లోహారమునకు;
ఉచ్చలుని మాతులుడు పోరుపిచ్చలింప
పద్మపురమునుజొచ్చె; కంపనవిషయము
నెవరు కాచెదు వారని యెంచుచుండ

హర్షవగ పెల్ల దెలిసి తా ననుమతించె
సాంద్రతరకీర్తి యైన యాచంద్రరాజు. 22

ఆ కురుక్షేత్ర సంగ్రామ మలముకొన్న
తరిని దుర్యోధనుండు పెద్దగనొనర్చె
ద్రోణపుత్రుని; తాను నారూపుగానె
చంద్రరాజును వాహినీశ్వరునొనర్చె. 23

భాద్రపదశుద్ధ నవమికి పారద్రోలె
పద్మపుర బాహ్యసీమల పరుల నితడు;
కంపనము గొన్నవానిని కరుణలేక
చంపె నుచ్ఛలుమాతులు చంద్రరాజు. 24

అహితు బాలియించి చంద్రరా జతనిశిరము
తనకడకుబంప తృప్తుడై దానినరసి
హర్షు డింకను జయశీలి నగుదు ననెడు
నాసతోనుండె నదినిశ్చయార్థమొగద;
సింహమెడనెడ వెనుచూచు చేగునట్లు
తిరిగి తిరిగి చూచి చను నదృష్టలక్ష్మి. 25

ఆ హిరణ్యాపురంబున నవనిసురులు
పట్టమునుగట్టి రుచ్చల ప్రభువునకును;
హర్షుడీమాట విని భయమందుచుండ
తత్సుహృద్వరులేగి యాతనికి ననిరి. 26

"లోహార దేశవాసులు
నీహితము నె కోరుచుండ్రు నెమ్మనములలో
శ్రీహర్ష! నీవుపోయి స
మాహితచిత్తమున మెలగుమందు శుభమగున్". 27

అని బోధించిరిగాని హర్షుడు వినండామాట సింహాసనం
బును, విత్తంబు, నమూల్యమైన వితరంబుల్ వీడిపోనొల్ల నం
చును బల్కెన్, హితులంత నీ వెనుకనే శుద్ధాంతకాంతావ్రజం
బును పుత్తెంతుమటంచు బల్కి మరియున్ పూరింతురీమాటలన్ 28

ఇంతకును పూర్వ మీధరాకాంతమెడను
తాళిగట్టిన రాజులు బాలిశులును
శునకమాంసముతిన్న నీచులు నగుటను
ఇప్పుడాగద్దె నెవరెక్కనేమి తప్పు! 29

అని పలికిన నా భూపతి
వినడాయె నమాత్యవరులు వే వచ్చినృపా!
జని యుండు నంతదనుకను
జనపతి సమరాంగణంపు జావె వరించున్. 30

మనమునగోరరించుకయు మానవనాయకు లాత్మవాహినీ
జనధన సౌఖ్యసంపదల శాశ్వతకీర్తి గడింపగోర యెం
దును తమరాజ్యమే స్థిరము దుస్సహమన్య నృపాలలక్ష్మినా
మొనలనుగూర్చిపంపుదురు ముందునుజూడరు వెన్కచూడరున్ 31

రాజుల కమాత్యు లగుదురు త్రోణమట్టి
ప్రెగ్గడలె యత్నహీనులు భీతిపరులు
డాంబికులునైన శతగుణాఢ్యముగ నహిత
మాచరింతురు శాత్రవ ప్రతతికంటె. 32

చేతబూనిన కర్రనే యూతగాగ
నమ్మి నడచెడు నంధుడు నా నృపాలు
డన్ని పనులను భృత్యుల కప్పగించి
తాను పడరాని యిడుమలనైన పడును. 33

సచివ వర్గంబునను బొత్తుసడలెనేని
నెట్టికార్యముఁగూడ జయింపనేర
దవనిలో నెవ్వరేని మీఁదరయ లేక
ఆత్మబలముననె నమ్మిన నహితనృపులు
పెట్టు నలజడి పాల్పడి రట్టువడుదురు. 34

అరిహస్తగతమైన యవనిభాగంబున
ద్రిమ్మరురాజులు తెలివిలేక
తామచెడుదురు; విధంబు చెడుదురు జ
యింపనేరరు వైరి నెన్నటికిని
అటుగాక భూపాలు డాత్మీయసైనిక
ప్రవరులతో బవరమున బడిన
యశముగాంచు పరాజయాప్రతిష్ఠ యదృష్ట
దేవతకే చెందు; దీనిబట్టి

యాహవక్షోణిలో క్షత్రియావతంసు
లించుకైన నిజక్షేమ మెంచబోరు
జూదరులు విత్తమెట్లట్ల శూరవరులు
ప్రాణముల లెక్కగొనరు వెన్నాబెరుగరు. 35

తన మంత్రాంగమువారి బిల్చి నృపుడంతన్ తెల్పగాగోరె తా
నొనరింపంగల కార్యమున్ సచివులున్ మున్మూరు చింతించి నీ
వును సత్కార్యవిధానమేలొకొననిచో పుట్టున్ మహానర్థ మం
చును బల్కన్ నృపుడాత్మహత్యకు మనస్సున్ జొన్పగాలేకనున్ 36

నను నే జంపుకొనంగలే నరులు నన్జంపంగ రాకుండుము
న్నెనసున్ జంపుడు మీరటంచు బలుకన్ వీరిండిమైనాడు రా
జని మంత్రుల్ మదిలో విచార మనివార్యంబైన తామావనిన్
పొనరింపంగను జాలమంచనిరి నిష్పంద్రొక్కు లెవ్వారికా?. 37

జనపతి కర్కశాత్ములగు నౌకరులంగని భృత్యులార! నా
మనమిపు డస్థిరమ్మయిన మంచిని మంచిగ జెప్పగావలెన్
వినుడు నృపాలు డెం తనుభవించిన వైభవమందునొక్కడే
ని నిలువ దంతమందు మృతినిశ్చయ మేలవిచారమింతటన్?. 38

స్వీయవిధాన నన్నిపుడు చెంది సుఖించిన యీ వసుంధరా
తోయజనేత్ర తా ముసలితొక్కవలెన్ పరునాశ్రయించి యిం
కేయలజళ్ళపాలగునొ, యెంతటిమోసము నెంతకుట్ర యీ
చాయలనున్నదింకెవరు చాలరుదీని జయించు కొంటకున్?. 39

అల్పులెయయ్యు గొంద రపహాస మొనర్తురు సాటివాడు తా
సల్పి మహాప్రయత్నము వశంపడ చేయడయేని కార్యమా
యల్పులె తత్ప్రయత్న మసుద్దై ఫలియించిన మెచ్చుకొందురా
కల్పము; లోపమెన్నరు; ప్రగల్భునిగానుతియింతు రేమొడన్. 40

తొల్లి నేవిత్తమును వెదజల్లి జనుల
పోషణ మొనర్చినట్టి యాభూతకాల
వర్తనము నెల్ల దూషించు వరుసవచ్చె
నుచ్ఛలుడుగూడ నాపయి నురుముచుండె. 41

నమ్మిన మంత్రులున్ భటులె నాకిటు లాపద తెచ్చిపెట్టినా
రిమ్మహి నెవ్వ డేర్పడ గ్రహించువివేకత వాడుగెల్చు వా
డిమ్ముగ నాత్మగౌరవము హెచ్చి స్వసంపదమీరగా జెలం
గుమ్మృతిమీదనే దెలిసికోబడు గౌరవ సౌరభంబునన్. 42

కప్పురము నేర్పడంగందు మొప్పమీరు
దాని తావిచే; నట్లెయుత్తముడు తన గు
ణంబులవలననె మహిని చిరంబు మనును
నిలుచు జిహ్వాగ్రమున మనీషులకు సతము. 43

ఎవనికీర్తి చిరస్థాయి యీజగాన
నెవఁడు ధనమెల్ల నపహృతంబేయయినను
తానువనరఁడో యాతఁడుత్తముఁడు; ధాత
తనకు జన్మస్థలంబైన వనరుహాంబు
కరి కరాగ్రంబుచేత చీకాకుపరచి
తనశిరోభూషణం బను తగవులేక
శీతకిరణుని గ్రహణవంచితుని జేసి
యున్నత పదస్థులకుగూడ చిన్నతనము
గూర్చు; నెవ్వరేనెగ్గు లగ్గులను సమము
గా భరింతురు వారు సంస్కారయుతులు. 44

పేము నిజాశ్రయంబయిన వేణువుకగ్నిరగిల్చి కాన ను
ద్దామ తరార్చి సంతతుల దగ్ధమొనర్చెడు నట్లు నీచులున్
పామరులైన సేవకులు పాడొనరింత్రు నిజాశ్రయంబు నా
పేము నగౌరవించు పృథివీపతి కంచుకి చేత నుంచుచున్. 45

అని దుఃఖమ్మున బల్కు రాజుగని ముఖ్యామాత్యుఁ డీవిష్ణు నీ
తనయున్ గావుము కోటయందునిచి భద్రంబొప్ప నీవంశ మిం
తనె యంతంబగు హాయికిందొలగుమన్నన్ వల్లెయంచున్ నృపుం
డును నాత్మీయ కుమారు భోజు ననిచెన్ దుర్గాంతరక్షోణికిన్. 46

దండనాయకు డంపు కభ్యంతరమ్ము
తెలుప హర్షుడు భోజుని తిరిగిపిలిచె
శౌర్యమును, సాహసమ్మును, ధైర్య మప్పు
డావహిల్లిన యాపదయే వెలార్చె. 47

మేఘముల నాశ్రయించి యే మెఱపు నురుము
నింద్రచాపము పొడ మెడు నీ ప్రకృతిని;
అట్లె మన గౌరవమ్ము, భాగ్యమ్ము, సాహ
సమ్ము, పదవియు పూర్వకర్మమ్మునీవి. 48

ఉన్నతపదస్థుడై యీతడున్న యపుడు
ఇంద్రుడునైన జయించు నంచెంచు కొనిరి;
అట్టివాడిప్పుడాపద నస్థిరుడును,
జ్ఞాన శూన్యుడు, పిఱికియు, నష్టశీలి
యయ్యెనని జనంబులు తూలనాడిరంత. 49

ఉచ్ఛలుని తండ్రి మల్లుడు మచ్చరించి
యుండిక్రౌర్యముడాచి మనోంతరమున
హానమను నెపమున రాజ్యమపహరించి
కొమరున కొసంగ కలతల గూర్చుచుండె. 50

ఈ రహస్యమ్ము శ్యాఃహిదుహితలు తనకు
తెలియజేయ నృపాలుండు తెలివిగలిగి
మల్లునిల్లు ముట్టడివైవ మాట యిచ్చి
స్వాయముగానుండె గృహబహిర్ద్వార మెదుట. 51

వలదని నందనుల్ తనకు పల్మరు చెప్పిన ద్రోసిపుచ్చి కే
వల మెఱిగింపగోరి తనభక్తి నృపాలుని చెంతకేగె ను
చ్ఛలుపిత; యింటినుండి వెలిచాయల కంపెను శలవాదిపుణా
త్రుల; కడకొక్కడున్ వరితుల త్రోవను సల్పెపదాప్లె
హోత్రముల్. 52

మరణకాల సమీపగు డఋజుశీలి
యైన యూరాజు మల్లు పోకార్పదలచె
దేవతార్చన చేయుచు తేజమెసగ
నున్నవానిని పగర నిల్చున్న తెరగు
ననె పిలుచుటయు తనదు మౌనవ్రతంబు. 53

వ. విడిచి. 54

జపమొనరింప మజ్జనచేసి ధరియించి
నట్టియుడుపులె మేన నలరుచుండ
ఫాలభాగంబున భస్మరేఖలు త్రిధా
భంగికాంతులు దెసల్ పర్వుచుండ
పలితార్ధకేశముల్ ప్రాయాగలో గంగ
యమునయు గలసినయట్టులుండ
ఉత్తమాంగమ్ముపై నున్న కుళ్ళాయియే
కవచంబువలె మేనగ్రాలుచుండ

ఛత్రమే డాలుగాగ హస్తమున దండ
మే కృపాణంబుగా నెంచి యేగుదెంచె
సమరభూమికి సాహసోత్సాహవశత
శత్రుమృగరాజి భిల్లుడు మల్లుడంత. 55

స్వామిభక్తి పరాయణ స్వాంతులైన
భటులు పలువురు మడిసి రభాగ్యవశత;
పేరుమిగిలె రథావట్ట విజయులనెడు
విప్రులిద్దరికును నాటి పృథనమందు. 56

ఉదయరాజొకండు యుద్ధక్షతాంగుడై
పరుగు చిత్తగించె స్వగృహమునకు;
మల్లు డింటితలుపు మరితెర్వబడకుండ
పగర తలలపైన బలిమి నురికె. 57

వార్ధకమందు పండి తెలుపైన శరీరముతో నితండు భు
క్త్యర్థముగా సరోజ కుముదంబులపై జను హంస నాగ బ్ర
త్యర్థులచేతి ఖడ్గముల యందును డాలులపైన తీవ్రతన్
మర్దన మాచరించి దివిమార్గమువట్టె యశశ్శరీరుడై. 58

మల్లు నగ్రమహిషి, మహిభావిరాజుల
తల్లి, నంద, తా, వితస్తకవలి
తీరమందు వెలుగు తీక్ష్ణానలజ్వాల
గాంచి హర్షు కూరకార్యమెంచి. 59

పతిజంపెన్ సుతుజంపె పెక్కుసుభట వ్రాతంబులంజంపె దు
ర్మతియై హర్షుడు పీనిజంప దగరే మత్పుత్రు లా జానుద
గ్ని తెరం గొప్పనటంచు బల్కియట నగ్నింగొల్పి తానందు దూ
కి తిరోధానము చెందె మానవతి కింకేమున్న దీ నేలపై. 60

ఆ సమయంబునందె యొక యర్భకి యగ్నిని దూకి ప్రేక్షక
త్రాసముగా లయించుటను తాగనులారగ జూచి దాది యో
ర్మోసరసీజ పత్రమధురోజ్జ్వలనేత్ర! త్యజించె ప్రాణముల్
ఈసడి నాకు నేల యిదె యేనును వత్తు నటంచటంబడెన్?. 61

అంత నచటునున్న యరినృపాలురు హర్షు
జంపజూచుచున్న సమయమందు
కరుణమీర నతని గాపాడె దర్శన
పాలు డహిత నిధన శీలుడగుచు. 62

ఆయలజడి మృతిచెందడు
రాయిడి పడవలసియున్న వ్రాతయెగలదో
ఆయువుతోనుండె నృపుం
డాయబ్దముగూడ జయమె యగునను నాసన్. 63

భాద్రపదశుద్ధ నవమికి భర్గుపదము
చేరె తమ తండ్రి యనుమాట చెవినిజేర
దుఃఖితులెయయ్యు మల్లు పుత్రులు నృపాలు
జంపు నిశ్చయమున నూరడింపు గనిరి. 64

ఆమరునాడు సుస్సలున కాగ్రహమెచ్చయి వాహినీపుర
గ్రామము తక్కగల్గునవి క్రచ్చరవిడి పలాయనంబుగా
భూమివిభుండు వెంబడిన పోరికి చందనరాజునంపె నా
సీమముగా నతండు చని చేసె మహాహవ మద్భుతంబుగన్. 65

ఆ యుద్ధంబున వీరులెందరో నశింపైపోవ పెంపొంది దు
ర్జేయుండై యరి యుండె నింక తనకే జీవచ్ఛవాకారము
న్నోయంచున్ నృపు డాత్మలో వెరపుగొంచున్నుండ
వచ్చెన్ శ్రవో
హేయంబై యొకవార్త చందనుడు నిందుం డీల్గిరంచు న్వడిన్ 66

ఆరీతి విన్న హర్షుడు
నీరై చనె నింక యేటి నెగ్గుట! యిక కా
శ్మీరావని రాజ్యశ్రీ
చేరె విరోధులను విధియె చెట్ట తలంచెన్. 67

అని గతధైర్యుడై జయము నాస దొరంగి నృపాలు డంతిమ
క్షణములలో నొనర్పదగు సత్కృతులేమి యటంచు లెక్కిడన్
జనపతి భార్యలందరు స్వసౌధములన్ తలుపుల్ బిగించి చి
చ్చును దరికొల్పియం దురుక జూచుచునుండ్రి కులోచి
తంబుగన్. 68

రాజగృహంబు ముంగిట శరక్షత గాత్రముతో విదూషకుం
డోజచెడెన్; మరొక్కయెడ నొక్కడు లక్ష్మిధరుండు మృత్యువాం
ఛాజితక్రోధియై మెలగ చయ్యనపాశ నిబద్ధు జేసివి
భ్రాజితుడైన వాని తమ బందిగగైకొనిరంత డామరుల్. 69

విజయేశ్వరంబున వెలయు ధనాగార
మునకు సుస్సలుడేగి ముట్టడింప
పహరాభటులు కడున్ భయమంది దిశలకు
వాయసంబులవలె పారిపోవ
రాజానుచరుల బీరంబున కాత్మలో
సుస్సలుం డపహసించుచు తదీయ
ప్రాణంబులకు దాను పరిరక్ష గావింతు
ననుమాట యిచ్చి పట్టాది యరుల
తనకడకు రాగజేసి సౌధాగ్రతలము
నందు తానుండి యటకు మెట్లమరకుంట
తద్భటులు వారి భుజముల ద్రాళ్ళగట్టి
మృతశరీరంబులటు పైకి నీడ్చినారు. 70

తమ్మువదలిన నన్యదేశమ్ముపోయి
యీమహావమానమ్ము తా మెంచుకొనక
బ్రతుకుదు మటంచు బల్కిన రాజసుతుడు
వారి ప్రార్ధనమున కొడంబడియెనంత. 71

ఆరాత్రి వారి యింటను
పోరామిదలిర్ప వారు భుజియించి పరా
రీరీతి వదలి వినయము
తో రాజకుమారుగొల్చు దుర్భ్రమ నుండన్. 72

వ. అచ్చట విజయేశ్వరాలయ ప్రాంగణంబునందు. 73

మాధర జాసతుల్ నృపుని మామకు బిడ్డలు రాజపుత్ర సే
నాధిపతుల్ మరిన్ పలువు రాశ్వికవీరులు ముఖ్యులైన స
ద్యోధులు నెందరో నిలిచియుండగ నుస్సలు డేగి ఖడ్గ ధా
రాధరితాన్య తేజు డయి యందరనింద యొనర్ప వారలున్. 74

వ. తన్ను శరణువేడ వారికి విజయేశ్వరు సాన్నిధ్యమున నభయ మొసంగితి ననెను.

అందరకున్ శరణ్యుడయి యావల తా దిగియున్న యింటికిన్
తొందర మీరబో నతనితో జనియిచ్చిరి జాతరూప సం
స్పందిత ఖడ్గరాజములు శస్త్రవిసర్జన కారులైన రా
రాణ్ణందనులన్ కుమారుడును డామరవర్గము కీయ వారలన్. 76

వ. వారు వారిని మృగములనువలె వధించిరి. 77

ఈ రీతిన్ దివసత్రయంబు చనగా హృద్యాన వద్యుండు సా
సూరగ్రామము చొచ్చి సుస్సలుడు బంధుప్రాయు లొపట్టునిన్
శూరున్ దర్శన పాలునిన్ చెరమరుంగున్ బాపగా వారలున్
దూరప్రాంతము పోవునట్టి తలపున్ రూపించి యాపిమ్మటన్. 78

శూరపురంబు పోయి యటసోలిన భార్యనుగూడి పట్టుడే
దూరము పోకయే నిలిచె తుష్టుడై యాచును దర్శనుండు నం
దే రహిమై జెలంగ నిటు లిర్వురు మిత్రులు నెంతకాలమో
కూరుచుచుండి రొండొరులకున్ పరమప్రియతానుకూల్యముల్ 79

వ. ఇట్లు సుస్సలుండు రాజనగర మాక్రమించు కొని యుండియు నుచ్చలు డంతకును మునుపే రాజ్యము నాక్రమించు కొని యున్నవాడు గావున తద్విషయమువ నాతనితో యుద్ధముచేయ దలంచెను. 80

ఇర్వురు సోదరుల్ సమత యేర్పడ నుండుదు రీడునన్ భుజా
గర్వమునన్, పరాక్రమ వికాసమునన్, సహనమ్మునన్ మనో
ఖర్వనుతీక్ష్ణతన్, పరనికార సమర్థత నందుచేత వా
రిర్వురు ప్రేమమీర చరియింతురు పెక్కుదినాల నుండియున్ 81

వ. అట్లుండియు రాజులు దురాక్రమణశీలురు గావున వీరికి
గూడ యుద్ధము తప్పదాయెను. 82

సుస్సలుండు రెండహస్సులలోపల
పట్టుకొనియె పెక్కుపల్లియలను
కాని విడిచిపోడు గారాముతో మున్ను
తా జయించినట్టి రాజనగరి. 83

భోజదేవుడు హర్షుని పుత్రకుండు
యుద్ధశీలుడు సుస్సలావిద్ధమైన
కలశ సుక్షేత్రమును గాల్చె క్రౌర్యమునను. 84

తాను తనతండ్రితో విరోధమ్ముగొన్న
తెరగుననె తనకుమారులు తెగువమీర
తన్ను గలహింతురని లోన దలచి హర్షు
డాత్మజులనెల్లరను బట్టి యాపివైచె. 85

అసహాయుఁడైయున్న యదనున దనపైకి
వచ్చు సుస్సలు నడ్డువారు లేమి
నెద నెరింగియు హర్షు డితర యుద్ధములకై
సేనలన్నిటిని శీఘ్రగతిని
పంపించివైచె నృపాత్మజుండును పితా
మహుని విధాన పెంపంగబడిన
అరులనెల్ల జయించి యార్జింపకుండునే
జయ మని రెల్లరు, చదివి చదివి

రాజ తంత్రము లాజికార్యములయందు
వాని నవలంబనము చేయు వారలరుదు
వివిధశాస్త్ర ప్రవీణులై విప్రవీగు
వారలెల్లరనుష్ఠాన పరులుగారు. 86

తాను కృతఘ్నుడయ్యెనని తత్తనయుండు కృతఘ్నుడౌనె! లో
కాన తిలల్ కనంబడును కంటికి నల్లగ పొట్టుకల్మిచే
కాని తదీయ తైలము సుఖంబగు తావి నొసంగుచున్నదై
మానవకోటిచేత నభిమానితమై గణనార్హ మౌగదా! 87

భోజదేవుఁడు చూపె నపూర్వశౌర్య
ధైర్య సాహసములు యుద్ధధాత్రిలోన
నుస్సలుం డోడి యతనిచే సొంపుదక్కి
తాను లవణోత్సవపురమ్ము తరలిపోయె. 88

తా మయిడస్సి భోజుఁడును తండ్రిఁ గూడి పురీపరీసరా
రామముచేరి యందు సుకరంబుగ నుండఁగ పిఁగుదెంచె సే
నామయుఁడౌచు నుచ్ఛలుఁ డనంతముగా జనుదెంచువార్త యా
ధీ మహితుండు సోదరుని తెక్కలికాని తనమ్ము నెంచుచున్. 89

రాజ్య మాక్రమింప రపరపతో వచ్చె
పోరు పిచ్ఛలించు మున్నె వీని
బట్టి బయలద్రోసి పారదోలక యున్న
దక్కదవని యనుచు నక్కచరచి. 90

వ. చీరదేవమునకు జేరి దేవనాయకుని జంపెను. 91

నగరపాలకు డగు నాగు డగణితాశ్వ
బలముతోడను గొప్ప కాల్బలముతోడ
నుచ్ఛలుని మీదికేతెంచె యుద్ధమునకు;

ప్రథమమున వానిఁ జూచి తా భయముచెందె
నుచ్ఛలుఁడు కాని నాగుఁడా యుగ్రమూర్తి
యెదుట సాగిఁబడె పాగ నివలనైచి. 92

మండలాధీశ్వరుని మాయమర్మములను
తాను మును కన్నవాఁడు కాగా నతండు
నాగువినయమ్ము నమ్మక నచ్చబలికె
"పొమ్ము తుంబాపురికి నీ గృహమ్ముచేర." 93

వ. అని పలుక నాగుఁడును స్వీయసదనమ్ముచేరి
యందెక్కువ కాలముండక. 94

తిరుగుచు నిల్లు నిల్లు భవతీమమదేహి యటంచు బిచ్చమె
త్తి రస సమస్తమున్ గడచి దేహముతూలి క్షుధార్తి జిక్కి పెం
పరి ప్రభుద్రోహశీలత ప్రపంచమునందున జాలె చూడ నె
వ్వరికిని జెల్ల దీగుణము వారలు కష్టదలంప శేలాకో. 95

రాజు వితస్తదాటి యెదురన్ గనె నల్లనివారు గూఢరే
ఖాజవులైన డామరనికాయము మధ్యప్రకాశమానుఁడై
యాజయచంద్రుఁడుండ మరినానది కడ్డముగాగ వంతెనన్
రాజులు నిల్ప నిప్పుడది లాతులకయ్యెను సాధనంబుగన్. 96

ఒక శతద్వారములతోడ నొప్పుచున్న
మేడపైభాగమున కేగి మిగుల వగచి
చేత శిఖ దాల్చి తనువు త్యజింపనెంత్రు
శ్యాహిదుహితయు నితరవీరాంగనలును, 97

వైరి నెదుర్పలేక తమవల్ల భుడాప్తపిచారుడౌట తా
మారసి రాజపత్ను లసహాయత చిచ్చురుకంగ నెంచుటన్
దూరమునుండిచూచి వలదోయనుచున్ చెయిసన్నచేసి క్రో
ధారుణితాత్ములన్ పతి వితస్తను దాటి పురోగమింపగన్. 98

నరపాలుడెక్కిన కరిరాజుకుంభాన
నురుశరాసారముల్ కురిసెనంట
భూపానుచరులలో పొలుపారునాశ్విక
సైనికుల్ పలువురు చచ్చిరంట
జయచంద్రుడే వచ్చి రయమారగా రాజు
గిరిమార్గముల వెంట తరిమెనంట
విధితప్పజూచుట వెనుదెసచూడక
ప్రాణంబులకు రాజు పారెనంట

కటకటా! యిట్టి నైరాశ్యఘటికవచ్చె
మహిత కాశ్మీరదేశ సింహాసనమ్ము
నెక్కి జనులకు నొక్కడే దిక్కుగాగ
నేలి పొగడొందినట్టి భూపాలునకును. 99

పూర్వ మొకప్పుడున్ నియతభోజనకాలమునందు సైతమా
యుర్వి విభుండు వస్త్రముల నూడ్చడు నేడు భయాన నాతపా
ఖర్వవిదాహతన్ బడలుకాంచియు పైపట మీడ్గిలంబడన్
గర్వమువీడి కాంతిచెడి క్రమ్మరుచుండె గృహంబుచెంతకున్.100

దుస్తరమయ్యె నశ్వమును తోలుట వానికి కేశబంధమున్
వ్యస్తమెయాచు కర్ణయుగ పార్శ్వములందున వ్రేలి కోటరా
గ్రస్థవినీల సర్పములకైవడి చెన్నెసలారె ఖడ్గమున్
హస్తమునుండి జారె నృపు డాయతనంబును జేరునంతకున్.101

కర్ణావతంసముల్ కదలికచే నూడి
నేలపై నెందేని రాలిపోవ
తాంబూలరక్తిమ తరిగిపో వా తెరల్
జిహ్వాగ్రమున తడి చేర్చికొనగ

పటుధూళిగ్రమ్మిన వదనమండలమున
        శోభయు పోయి విస్తుగలిగింప
ఆయాసమున జిక్కి యుసిలమటించినదాన
        ఘర్మాంబువులు మేన గ్రమ్ముచుండ
వామభాగాన నగ్నివేల్వంగనున్న
రాణులను వలదంచు కరంబునెత్తి
సైగచేయుచు కుములుచు మూగబాధ
హర్షభూపతి రాజగృహమ్ముచేరె. 102

రాజనగరసమీప విరాజమాన
గృహము నొకదాని జయచంద్ర నృపుడు తాను
నదిని దాటిన వెంటనే కదురజేసె
నగ్గిసెగలను; భోజు డాయగ్ని గాంచి. 103

అరులను గెల్చునాస విడనాడి విరోధి ధనుర్విముక్త భీ
కర శరధారకు న్నభిముఖంబుగనేగి వితస్థదాటి య
ద్దరి గల సింహరాజ మఠధామముఁజేరె కుమారుఁడోయుచున్
నరపతియుం జనెన్ తన మనంబున పెల్లగు దుఃఖమారగన్. 104

రాజపత్నులెల్ల రాజెడు మంటకు
నెదుట నిల్చియున్న గృహముచొచ్చి
వారి ఘోరయత్న మూరడింపగవచ్చు
భటుల గాంచి వైరిభటు లటంచు. 105

మనములనెంచి రాట్సతులు మానధనుల్ తమయున్న యింటి క
గ్గిని దరికొల్పి రంత నటక్రేవలనుండిన డామరాధముల్
కనకనకాలిపోవు గృహకాశ్యపిలోబడి నిర్నిరోధతన్
ధనకనకాదులున్ మరియు తక్కున మూల్యవిచిత్రవస్తువుల్. 106

కొనుచు పరస్పరం బొరసి కొట్టుకొనంగ భయంకరంబుగా
తనువు దొరంగి కొందరు క్షతాంగముతోడుత కొందరున్ విచి
త్రనటన చేసిరంత నొకధార్ష్ట్యుడు చక్కెరయన్న భ్రాంతి నో
టనుఘనసారమున్ గొనిపడన్ వయిచెన్ నదిలోనచక్కెరన్. 107

రంధ్రములులేని ముత్తెముల్ భ్రమసిచూచి
తండుల భ్రాంతిచే తిరుగండ్ల వైచి
డామరస్త్రీలు విసరదొడంగ పోయె
ప్రథితకాశ్మీరమునుండి భాగ్యలక్ష్మి. 108

అసమానాభరణాభిశోభితలు దేహాతీత సౌందర్యవా
రసులౌ రాజకులీన లుద్ధురతర ప్రారంభులై తమ్ముఁజూ
సి సహాసంబుగ డామరుల్ గవియ సచ్ఛీలంబు గోల్పోయి రా
పశుతుల్యుల్ తముడాయవచ్చుటయు నా పన్నుల్
వసంతాదులున్. 09

అగ్గిగూలి చదలనంటి రాజెడుమంట
బూదియైరి వారి పూతచరిత
మీధరిత్రిపైన నెంతకాలంబేని
చెప్పబడు గుణంబు చెడదు జగతి. 110

మండిపోవు నిండ్లనుండి గంభీరంపు
ధ్వనులు నాల్గుదిశల పర్వదొడగె
ఘనవసంతకాల కాలాభ్రపటలిలో
పుట్టు గర్జనముల పోలుపుదెలుప. 111

శ్రీపద్మశ్రీప్రాంత
స్థాపితుడై హర్షుడిట్టి సంక్షోభంబున్
చూపు గొని గతమునకు సం
తాపించుచు నుండె బాధితాత్ముండగుచున్. 112

తన కులధర్మమెంచి వసుధావరు డంత సమిద్విహార వ
ర్తన వసుడై ధరన్ పడదలంచియు వారితుడై పదాతిచే
తను మరలన్ తదుత్క్రమణతాపకుడయ్యె ననంతపాలు ప్రే
రణమున; దండనాయకుడు రాజునుమాన్స్వ రణాన కేగగన్.113

అనికినైనను లోహారమునకునైన
మరలు టుచితం బటంచు చంపకుడు తెలుప
ఆప్తుడైన ప్రయాగు డా యవనిపతికి
నరుగ నుత్సాహమిచ్చె లోహారమునకు. 114

తనసుతు జాడ యేర్పడమి తక్కక వానిని రోయుమంచు చె
ప్పిన నృపుతోడ చంపకుడు పీడించనంగను జాల నిన్ను నొ
క్కని నిటనన్న రా జతని గాంచి విధేయుడ వింతకాలమున్
పని వినవేమి నేడు సుతు బాసిన పెన్వగ తీర్పు మంచనన్.115

కొమరుడు లేమి చీకటులు గుప్పిన యట్లయె నేను తత్సమా
గమమున చింతబాయుచు సుఖస్థితి నుండుట నీ కనిష్టమే
యమలినశీలి! నా నవనతాస్యముతో నతడేగె కొంద రు
త్తములు సహానుయాయులయి ధైర్యము తెల్ప కుమారు
రోయుచున్. 116

వ. ఇట్లరిగిన యేబదిమందిలోను చంపకుడు వితస్తం దాటుపరి కయిమగుప మాత్రమే మిగిలిరి. భోజదేవు డున్న తావు తెలియక చంపకు డాసాయంకాలముననే వితస్తాసింధు సంగమ ప్రదేశమునకు వచ్చెను. మఱికొంద రానెపమున నతనిని విడిచిపోయిరి. 117

రాజపురిఁపోడ జరిగిన రణము నందు
లంచములు తిన్నవాడును రాకుమారు
నిల్పె లోహారమున కేగనీక, సైన్య
మగ్గిబడగాల్పె, మరియు తా నన్యయుద్ధ
నియతుఁడైయుండ పగవారి నిజపురాన
జొరగజేసె, నయోగ్యుల కిరవుగూర్చె
నట్టి దండనాయకు డిస్సు డవని పతికి
మంత్రిగా నుండె నత డొక మాయలాడు. 118

చేయ దలంచు కార్యమును చేయగ జాలని దుర్బలుండు; స న్నాయిని దాని యూర్ధ్వముఖనాళమునుండియు గాక పార్శ్వ భా గాయత రంధ్రమార్గముల యందున నూద ధ్వనింప నట్టు లే దో యెవరో వచింప విని యండి నృపాలుడు నేర జేసియున్. 119

నీచులును గూడ చేరి యయాచితముగ
చెప్పిరేని నాలోచనల్ చెడును లక్ష్మి
రథము తోలు త్రైలోక్యుడు రాజుతోడ
పలికె బిగబట్టి చేతిలో పగ్గములను. 120

నీ పితామహుండు ప్రాపించె నేకాంగ
సైన్య మూతగాగ జయము తొల్లి
అట్లె నేడు మనము నక్షపటలమున
కరిగి జయము గొంద మరుల్పైన. 121

విను చామాట నృపాలు డయ్యెడకు తా వేబోవ చింతించు చుం
డ నపారాగత వర్షపాతమున నానాదిక్కులం బోవు న
ర్తన శాలోద్గత ప్రేక్షకప్రతతి నా నల్దిక్కులం బారె వా
హిని హర్షుండును కంఠహారముల నర్పించెన్ సుతున్
రోయుగన్. 122

ఆభరణహీనుడైన యాయవని విభుడు
తోచె సంపద్విహీనునిత్రోవ, నంత
నతని యనుచరు లెల్లరు నడుగడుగున
బారెపో నాత డేగు నప్పటికి నక్ష
పటలమున కొక్కభృత్యుడే పజ్జలేడు. 123

మనసులో సందియుంపడి మనుజవిభుఁడు
మంత్రిమాత్ర సహాయుఁడై మనుజవరుల
యిండ్లకును బోవ నొక్కరే నితని గాంచి
యాదరము చూప రాసమయాన కపిలుఁ
డన్నప్రెగ్గడ యింటికి హర్షుఁడేగ
నతనిభార్య దయామతి నంప దలచె
నితని లోహారమున కోడ నెక్కజేసె. 124

వ. కాని రాజు భయపడి యందులకు సమ్మతింపలేదు. 125

హర్షుని కుమారు లందరు నతనితండ్రి
తో నతం డెట్లు కలహించె తొల్లి యట్లె
యిపుడు తనతోడ కలహించి యిందు నందు
దాగిరి ఋణప్రదాతకు దాగినట్లు. 126

వారును వీరు పల్కెడి ప్రవాదములన్ విని రాజు తాను మున్
నేరక చేసితింగద యనేకములైన యకృత్యముల్ మహీ
భారముగా నటంచు వలవంతల నుక్కె నమాత్యులున్ ధరి
త్రీరమణుండు తమ్మతకరించు భయంబున తెల్ప రేమియున్.127

ఆశాభంగము చెంది మంత్రులయెడన్ హర్షుండు వారెల్లరన్
లో శంకించుచు చేర నేగెను విలోలుండౌచు ప్రద్యుమ్నమున్
పాసెన్ జ్ఞానము చీకటుల్ గవియ నశ్వం బాపి యద్గద్గనన్
స్త్రైశానన్ జొహీలాసురాలయము చేరెన్ చేర నాపిమ్మటన్. 128

వ. అనంత పాలాది రాజపుత్రు లతని విడిచిరి. హర్షుని సోదరుడును దండనాయకుడును గూడ నతనిని విడిచి పోయిరి. 129

దేహచ్ఛాయ నశించె చేష్టయు పరాధీనస్థితిన్ తెల్పెడున్
దేహాచ్ఛాదన కొక్క వస్త్రమును మైత్రింబూని ప్రాయాగుడే
సాహాయ్యంబుగ నుండ నానృపతి నైచ్యం బొందెది క్కేది తే
జోహీనుం డయి మృత్యుకాల గదితాసుండై మహాదీనుడై. 130

చంపకుని సేవకుండును జలకునింట
పాచకుం డగు ముక్తుడు ప్రభువుకడకు
వచ్చి మంత్రాంగమును సల్ప జొచ్చె; నిటుల
మువ్వురును దత్ప్రదేశాన మూగి తిరుగ. 131

ప్రాంతీయ పర్వ తాభ్యంతర కందర
స్థలము వెల్వడి ముదుసలి యొకండు
తత్తిరియీ సవిధ పథస్థుడై వారితో
ని ట్లనె ప్రభువరు లేగుచున్న
మార్గమ్ము కుల్యాసమాయాసకర మగు
నావుడు వారలు నావ నెక్కి
జయపురదుర్గమ్ము చన గోరి పిలిచిరి
పడవ నడపు వాని భద్రముగను
భీమదేవు డుండు గీము చేరుదలంపు
హార్దుకుంట నది ప్రయాగు డెరిగి
పోయి కావు మయ్య పురుషార్థ మిది యంచు
సంధి చేయ నతడు సమ్మతించె. 132

వ. పిమ్మట పడవ పీ రున్న దరికి వచ్చుటయు నిర్భాగ్యు
డగు నారాజు గజగజ వణకుచు నందు గూర్చుండ డయ్యె. 133

ఆపదలు వచ్చుతరి మానవాంతరంగ
మలసతం జెంది నశియించి యమసదనము
దాపునకె కొనిపోవు నాతనిని; తెలివి
కూరనీయదు; మంచిని కొనగనీదు. 134

పాపపంకిలమై శవప్రతతితోడ
కప్పబడి యున్న భూమిని క్షాళి తమ్ము
చేయ నేతెంచెనో యన శీఘ్రగతిని
వచ్చె ప్రావృట్పయోధర ప్రబలధాటి. 135

భూమి నిర్జనమై కడున్ బోలుపు బాసె
కారొ్మొగులు గ్రమ్మి జగ మంధకార బంధు
రమ్ముగను దుర్దినమ్ముగ గ్రుమ్మరించె
వారిధారల; హర్షుడు భయము గదిరె. 136

పిత్రివన దుర్గమందున ప్రీతిమోయి వ
సించుచుండు సోమానంద సిద్ధు; డచటి
తరులనీడల నిహ్ను డన్ తపసి యొకడు
నిలుచు నొక పర్ణశాలయే నెలవుగాగ. 137

విరహాభుజంగియున్, భిషచి పేరును నొప్పు నొకర్తు గూడి దు
ర్భరతర బాలికాఘటన వర్తక మారఁ జరించువాడు; తా
నెరుగక ముక్తు డాస్థలము నేర్పడ జెప్పెను హర్షుతోడ స
త్పురుషుల కుండగా దగిన పుణ్యప్రదేశ మటన్న భ్రాంతిచే. 138

మార్గమును చూప ముక్తుడు, మనుజవరుని
వెనుక నుండి ప్రయాగుడు వెంట రాగ
ఎడ పదడప శంపాలత తళుకుమనగ
నాటిరాత్రి నృపాలు డచ్చోటు చేరె. 139

శిరముపై లేనెవేద యుష్ణీష మొదలి
కైన లే దొక బొంత కుట్టమరుగుడ్డ
తక్క మనుజేశునకు; నతం డక్కతాన
చలికి వణకుచు నాపర్ణశాల చేరె. 140

గోడపైనుండి దుమికి ముక్తుడు కవాట
మును దెరువ రాజు లోనికి పోయె గాని
యతని దక్షిణపాదమ్ము నందు గాయ
మస్ర మొలికింప నది గాంచి యశుభ మనుచు. 141

వ. రాజు తన కంత్యకాల మాసన్న మగుట నిశ్చ
యించు కొనెను. 142

ఆ కుటీరాంగణమ్మున నంధకార
మగ్నుడై నాటిరాత్రి యామనుజవరుడు
జోగుచును నిద్రచే భయస్థుం డగుచును
గడపె తలపోయుచును కష్టకాల మెదను. 143

ఉన్నతి నుంటి వెన్క నిపు డొంటరినైతి విరోధు లాక్రమిం
ప న్ననువైన యిల్లు; తిన బట్టెడు కూడును మాలి డస్సి గ్రామ
గన్నన నుండి భిక్షుకుని గర్భకుటీరమునందు డాగగా
పన్నె విధాత తొంటి విభవంబు సమస్తము ప్రాలుమాలగన్ 144

ధారుణి రాజ్యవైభవము దాయల కోడి, సతీమతల్లులన్
దారల నగ్నిలో గలిపి నందనునిన్ విడిపోయి, యొక్కడే
కూరిమి కాడు లేక, కడుగుంది క్షుధార్తిని, మూగ చీకటుల్
చోరునిరీతి నీ గుడిసెలో తల దాచుకొనంగ నైతిగా. 145

వ. రాజిక్కడ నిట్లు దుఃఖించుచు నా రాత్రి గడపు
చుండ నక్కడ భోజు డొక రిద్ద రశ్వసైనికులతో నస్తి
కరణము చేరెను. అంతలోనన. 146

వానితల్లి పంపె పరువంపుటన్నంబు
యానసమయ భుక్తి కనువుగాగ
నమ్మినట్టి లెంక నాగేశ్వరుని చేత
నతడు వచ్చి భోజ నరయుచుండ. 147

వ. ఆ రాజకుమారుండును తాను డాగియున్న శూన్యాల యమ్ము వెలువడి వచ్చి విద్రోహులైన డామరులచే ముట్టడింప బడిన వాడై. 148

క్షాత్రగుణమ్ము పెల్లుబికి శౌర్య మవార్యముగాగ శ్యాహిదా
హ్రాతుడు చేత ఖడ్గము ధరించి యరాతుల నెల్ల స్వఃపురీ
యాత్రకు లో నొనర్చి యొకయంబక మేదెస నుండియో వడిన్
గాత్రముదూటి రక్త మొలుకన్ రణభూమి కవుంగిలిన్ గొనెన్ 149

వ. అంత వేగుటయును సన్యాసి నారయంబోయిన ముక్తుండు వానితో గూడ తత్కుటీరంబునకు గ్రమ్మరి వచ్చి లోన తాళము వేయబడియున్న వాని గది తలుపు తెరపించి యందు రాజునకు ప్రవేశ మిప్పించెను. 150

అలుకబడిన నేల నాక్రమించిన చాప,
చాప వారిలు షుశక సంతతులును
కలిగి రోత గొల్పు కటిక వానిగృహమ్ము
వలెనె యుండె జీర్ణపర్ణశాల. 151

అంతకును మున్నె భిక్షాన్నమరయఁబోయి
రెండు హరివాణముల కూడు నిండ తెచ్చె
ప్రాణసముడైన రాజు క్షుధార్తి బాప
నా ప్రయాగుడు స్వామి కార్యార్థి యగుచు. 152

వ. అది గాంచి రాజీ సరస భోజనపదార్థంబు లెచ్చటివని యడిగిన. 153

విందు జరిగెడు నొకచో లభించె నిద్ది
అయిన నామన మగును చింతాకులమ్ము
కటకటా! లోకు లెంత నిష్కరుణమతులు
నీవు సింహాసన భ్రష్టుడై వనరగ
వారు విందారగింతు రీ వరుస యేమి? 154

వ. అని ప్రయాగుడు పలుక హర్షు డిట్లనియె. 155

విధివశమ్మున గోల్పోయి విభవ మెల్ల
నేడు నిరుపేద నైన నన్నే స్మరించి
ప్రజలు దుఃఖాత్ము లగుటయు పాడి గాదు
దినకరుం డస్తమింప ధాత్రీ జనములు
శ్రమనివారక మైన నిద్రను గన రొకో! 156

వ. అని పల్కినను ప్రయాగు డాయోగిరమ్ము రాజున
కీ నొల్లక తనకడ నున్న యొక యమూల్యోత్తరీయము నమ్మి
తత్క్రయధనంబున నాహారంబు విలిచి తెచ్చి రాజునకు బెట్టి
తత్క్షుధ తీర్చెను. 157

ఆ కుటీరాధి పతి రాజు ననగరాని
మాట లాడుచు విసవిస మరలిపోయె
దీనుడై రాజు గూఢత తెలియబడునో
యన్న భీతిని వా డన్నవన్ని సైచె. 158

వ. నాటి సాయంతన మా సన్యాసి యొక సామాన్య
యువతితో గ్రమ్మరి రాగా ప్రయాగుడు దానిని గాంచి పురము
నందలి విశేషము లేమియని యడిగెను. అప్పుడది భోజుని మరణ
వార్త వినిపించెను. అంత హర్షం డిట్లు దుఃఖించెను. 159

హా! భువనైక సుందర! విహాయసచారి సమిద్ధురంధరా!
హా! భుజదర్పమండన! రణాంగణవైరి శిరోవిఖండనా!
హా! భిదురోగ్ర శాసన! ధరామర వాక్యనివిష్టితాసనా!
హా! భజితస్మితానన! బలానల దగ్ధ విరోధికాననా! 160

నీవు విరోధితండముల నేలను గూల్చుచు నుంటి వంచు సం
భావనమై జరింతు విధి మాఱు తలంచుటచే కుమార! పా
పావహులైన శాత్రవుల పాలయి ప్రాణము వీడి తింక రా
బోవు గదా సురేంద్రుపురమున్ చోరబోయి మముం
గనుంగొనన్. 161

వ. అని పరిపరి విధముల వాపోవు రాజుం గని ప్రయాగుడు గతమునకు వగవం బనిలే దని యూరడించె. ఇట్లొక్క రెండు దినములు గడచిన తరువాత సన్యాసికి వాని మిత్రు డొకండు రాజును తద్విరోధులకు బట్టి యిచ్చిన గొప్ప బహుమతి లభింపగల దని చెప్పుటయు, వాడందులకు సమ్మతించి యా ప్రయత్నమున నుండె. ఇచ్చట కుటీరంబున హర్షుడును, ప్రయాగుడును ఆహారము తే బోయిన సన్యాసికై యెదురు చూచుచు, నాకటిబాధ కోర్వజాలక తమయిప్పటి దుస్థితికి వా పోవుచు నుండిరి. 162

పైయిరువురు సన్న్యాసులు
*కాయస్థకులీను నొకని గైకొని తద్వా
రా యిల్టరాజునకు వే
గై యెఱిగింపగ నతండు కడువేగముతోన్. 163

వ. కాయస్థుని గైకొని యుచ్ఛలుని కడకు రాగా. 164

భూరిభిశ్చలుండు పురుషార్థ మెన్నక
హర్షు డడగియున్న యట్టితావు
నుచ్ఛలునకు దెలుప నుఁద్రిక్తుడై యత
డిల్టరాజు నితర హితవరులను. 165

వ. తోడ దీసికొని కొందరు డామరులును తమ్మనుగ
మింపగా కుటీరంబు దాపునకు వచ్చిరి. 166

వాకిట వచ్చుచున్న రిపువర్గము గాంచి నృపాలు డాత్మలో
శోకము దక్కి వీరపురుషోచిత రీతిని చిన్నకత్తి యొం
డాకడ నుండ కేల గొని యప్పుడ పైబడ వచ్చు నొక్కబా
ధాకరు హింసకారు పడదన్ని యురంబును కాలఁద్రొక్కుచున్. 167

* ఆ కాయస్థుని పేరు భూరిభిశ్చలుడు.

చంప నోపడయ్యె చాంద్రొక్క గల్గియు
ధర్మ మెంచి భూరికర్మ మెంచి
అంత గుడిసె కప్పు నందుండి యిరువురు
లోని కురుక వారినేని కొసడు. 168

వ. కాని యీ లోపుగా పలువురు డామరులు లోన ప్రవే
శించి ముందు ప్రయాగుని చంపి రాజు భుజముపైనను, తలపై
నను గొట్టి యాతడు కొట్టిన దెబ్బను తప్పించుకొని యురముపై
రెండు మూడు తడవలు కత్తితో పొడిచిరి. 169

మూషికముల కొరకు పొంచుండు మార్జాల
మొడిసి భాండమందు పడువిధాన
హర్మ్య మున్న యిరుకుటావరణమ్ములో
జొచ్చి డామరాళి వచ్చి రతని. 170

రాజుశిరము నరకి రక్కసిమూకలై
గడకు చివర జేర్చి కట్టినారు
విగ్రహముల భూమి విభుల శిరమ్ముల
నరకు పాడువేళ పరగె నపుడు. 171

జనపతి యీ క్రియన్ సకల సంపదలున్ వెలిపోవ ప్రాణముల్
తనువును వీడిపోవ వసుధాస్థలిపై మిగిలెన్ తదీయమా
గుణ మది యొక్కటే, పరులకున్ సయితమ్ము వచింప దగ్గదా
తని యశ మొక్కటే,చిరత దాల్చుతదీయచరిత్ర మొక్కటే172

కుటిల మతులైన యనుచరకోటి వలన
వంచితుం డయి కోల్పోయె వసుధ నితఁడు;
అని చరిత్రకారులు చెప్ప ననువుపడిన
దీతని చరిత్ర యిది దీన నెరుగ గలము. 173

సప్తమతరంగము సమాప్తము.

---

# లఘు టీక

—:o:—

పద్యసంఖ్య.

1. వారువము = గుఱ్ఱము.
4. నిట్టలము = అధికము
10. షండత = పౌరుషహీనత.
11. హర్యక్షము = సింహము.
15. జిగి = కాంతి.
17. తామిస్రము = చీకటి.

పద్యసంఖ్య

21. లావరి = బలముగలవాడు. వ్యవస్థ = క్రమము (Order)
22. పిచ్చలింప = అతిశయింపగా, కంపన విషయము = కంపనదేశము
వగపు = విహారము.
29. బాలిశులు = మూర్ఖులు.
30. జని = పుట్టుక.
31. మొన = సేన.
37. వీదిడి = నెరిపాడు.
39. స్వీయ = పతియందు మాత్రము అనురాగముగలనాయిక.
40. అపహాసము = ఎగతాళి.
45. కంచుకి = అంతఃపురము కావలివాడు.
47. వెలార్చె = వెలికిద్రోలెను.
52. వ్రతులు = మునులు.
55. మజ్జన = స్నానము, భిల్లుడు = బోయవాడు.
58. ప్రత్యర్థులు = విరోధులు.
60. జామదగ్ని = పరశురాముడు, తిరోధానము = మరుగుపడిపోవుట.
61. సడి = నింద.
65. దుర్జ్ఞేయుడు = తెలియబడనివాడు.
72. పోరామి = స్నేహము.
83. అహస్సు = పగలు.
84. ఆవిద్ధము = తొలువబడినది లేక కట్టబడినది.
89. తెక్కలికానితనము = మోసము.
90. రవరవ = స్పర్థ.
107. ధార్ష్ట్యుడు = దిట్టమైనవాడు, ఘనసారము = కప్పురము.
116. గుప్పుట = చిమ్ముట.
127. అతకరించు = అధఃకరించు.
130. దిక్కేడి = దిక్కుమాలి.
132. గీము = ఇల్లు.
141. అస్రము = నెత్తురు.
149. అంబకము = బాణము.

# సవరణలు

⁕

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 8 | కార్యమైన | కార్యమైన |
| 5 | 12 | ప్రభువ్రుంది | ప్రభువుండి |
| 6 | 10 | డీకాౄరి | ఢీకాౄరి |
| 11 | 2 | వచిపైలున్ | సచివ్రులున్ |
| 15 | 7 | శలవాడిప్రణా | శల్వాణాదిప్ర |
| 19 | 2 | శేజ్ఞ | శేజ్ఞ |
| 21 | 15 | రాజ్ఞాంద | జ్ఞాంద |
| 24 | 4 | సేన న్నిటిని | సేనలన్నింటిని |
| 31 | 5 | 09 | 109 |
| 39 | 5 | లేనవేద | లేనలేద |

# PRATIKSHA

BY

Renduchintala Lakshmi Narasimha Sastry.

(pp. 39. As. 8.)

This is a book of lyrical poems published by the author as the third in the series of Kalakallolini Grandha Mala. There are twenty short poems excluding the first which is dedicatory. As the title indicates, the poems seek to express the various shades of emotion associated with unrequited love which awaits fulfilment. Except in a few of them the metre adopted is the Telugu blank verse and the verses run freely. The language is generally chaste but for a few expressions like 'Visalela' which jar on the ears.

'Jivitapatham'. 'Nityapathikudu,' 'Swetchaavihangamu' and 'Prakritito', are worthy of special mention, the language and the emotion keeping pace with each other. A high degree of poetic feeling and expression are reached in the last poem where the author communes with nature.

Some of the expressions used like 'Vipinavasanadhari', and 'Prapanchagola Bahiranan-yasthalaalu' are suggestive and bring a whole picture before our minds.

S.B.D.
ది. 23-12-58

—*The Hindu*, MADRAS.